# కణ్వమహర్షి

డాక్టర్ జె. రామకృష్ణ




తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

వేదకథాభారతి - 2

# కణ్వమహర్షి

రచన

డాక్టర్ జె. రామకృష్ణ

ప్రధాన సంపాదకుడు

ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య




ప్రచురణ

డాక్టర్ ఐ. వి. సుబ్బారావు, ఐ. ఏ. ఎస్.,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

1999

VEDAKATHĀ BHĀRATI - 2

**KAṆVAMAHARSHI**

by

***Dr. J. Ramakrishna***

Chief Editor

***Professor S. B. Raghunathacharya***

First edition 1999

Copies . 10,000

Published by

***Dr. I.V. Subba Rao, I.A.S.,***
Executive Officer
Tirumala Tirupati Devasthanams
Tirupati

Price

Printed at

**ANNAPURNA GRAPHICS**
53, (Upstairs) R S Gardens
Tirupati ✆ 30184

# మామాట

**డాక్టర్ ఐ.వి. సుబ్బారావు,** ఐ ఏ ఎస్ ,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

నిత్య సత్యమైన ప్రమాణాలు వేదాలు. మానవజాతి మనుగడకు అడుగడుగునా మార్గదర్శనం చేస్తూ నిస్స్వార్థ బుద్ధితో, త్యాగమయమైన ప్రవృత్తితో తమ తమ జీవితాలను పండించుకున్న ఎందరో మహానుభావుల జీవన వైభవాలు మనకు వేద వాఙ్మయంలో దర్శనమిస్తున్నాయి

''ఆహా! ఎటువంటి కర్తవ్యదీక్ష! ఎంత విశాలదృష్టి! ఎటువంటి విశ్వకల్యాణభావన! ఎంతటి ధార్మిక చేతన!'' అని మనల్ని ఆశ్చర్యపరిచే జీవనవేదం మనకీ వాఙ్మయంలో ప్రత్యక్షమౌతుంది. ఆ వేదనాదాన్ని ఇంటింటా వినిపించాలనే మా ఆకాంక్షకు ప్రతిరూపమే -

**ఈ వేద కథా భారతి.**

వేదకథాభారతిలోని ఎనలేని మానవత్వపు విలువలు ఈ తరాన్ని ప్రభావితం చేయగలిగితే అంతకంటే మాకు ఆనందమేముంటుంది ?

ఈ కథాపుష్పాలను సంపాదించి తీర్చి దిద్ది అందమైన మాలగా రూపొందించిన ప్రొఫెసర్ ఎస్ బి రఘునాధాచార్య గారిని మనసార అభినందిస్తున్నాను

ఇంత చక్కగా ముద్రించిన **అన్నపూర్ణ** గ్రాఫిక్స్ వారికి అభినందనలు

జయతు జయతు భారతీ

వేద కథా భారతీ



# మనవి

వేద కథాభారతి

అంతశ్శత్రువులను అణచివేసి కొన్ని ఆదర్శాలకు, విలువలకు పట్టంకట్టి, ధార్మిక జీవనానికి ప్రాణంపోస్తూ ఈ లోకంలోనే కాక ఇతరలోకాల వారికి కూడా నిండైన మానవత్వమంటే 'ఇది' అని ఆచరణ పూర్వకంగా నిరూపిస్తూ, అందులోని మధురిమలను చవిచూపిస్తూ వేదనాదవిభాసురమైన ఒక జీవన స్రవంతి ఈ గడ్డపై వెల్లివిరిసింది.

జలజలసాగే ఆ అమృత వాహిని వసుంధరను రసమయం చేసింది సస్యశ్యామలం చేసింది సుగంధపరిమళాలను వెదజల్లే నందనోద్యాలను వెలయించింది. మానవ సృష్టిలో అరుదైన ప్రమాణాలను కొన్నింటిని నిలబెట్టింది వాటికి కాలదోషం లేదు ఆనాటికి, ఈ నాటికి, ఏనాటికైనా మానవతకు గమ్యాన్ని, జీవనానికి అర్థాన్ని పరమార్థాన్ని సాధించడంలో ఆ ప్రమాణాలు చరితార్థాలయినాయి అలాంటి జీవన చిత్రాలకు పట్టిన అద్దమే ఈ వేదకథాభారతి

ఒక్కసారి పరిశీలించండి ! ఆ చిత్రరామణీయకతను మంచిమనసుతో దర్శించండి ! వారి ఆత్మల ఔన్నత్యాన్ని వారి భావనల ఔచిత్యాన్ని మీరు తప్పక అభినందిస్తారు ! అవి మంచివని తోస్తే అనుసరించచడానికి ప్రయత్నించండి ! ఆనందించండి !

ప్రమాధి - నిజజ్యేష్ఠ
బహుళ - సప్తమి
5-7-1999

ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య

# కణ్వమహర్షి

భారతీయసంస్కృతికి మూలాధారం వేదాలు. ఋగ్వేదము మొదలైన నాలుగు వేదాల్లో మంత్రపారం కంటే ముందు ప్రతిమంత్రానికి సంబంధించి ఋషి - దేవత - ఛందస్సుల వివరణ ఉంటుంది. ''ఋషయో మంత్రద్రష్టారః'' మంత్రద్రష్టలు లేక స్తోత్రకర్తలను ఋషులంటారు అలౌకికమైన సమాధిస్థితిలో మంత్రాలను దర్శించగలిగిన వారు మంత్రద్రష్టలు. ధర్మసాక్షాత్కారం పొందిన మహానుభావులు వీరు సకల పదార్థ విజ్ఞానఖనులైన వీరు తమ తరువాతి తరంవారికి మంత్రాలనుపదేశించారు. ఇలాంటి ఋషి లక్షణ సమన్వితులైన మహనీయుల్లో పేర్కొనదగినవాడు కణ్వుడు.

**ఆహా ! ఎంత చక్కని ఆశ్రమం !**

సుందరమైన ఒక ఆశ్రమం సుమ పరిమళాలతో విందుచేసే చల్లని గాలులు వీస్తున్నాయి కుహూ కుహూ రావాలతో శ్రవణానందం చేస్తున్నాయి కోయిలలు. పరవశంతో పురివిప్పి నాట్యం చేస్తున్న మయూరాలు చూపరులకు నయనానందం పంచిపెడుతున్నాయి మధుర మకరందాస్వాదంతో ఝుంఝుమ్మంటున్న తుమ్మెదల పాటలు, గలగల పారే సెలయేరుల అలల మధురరాగాలు - ఇలా మధురభావలహరులలో

తేలిపోతున్న ఆనందానుభూతుల నిలయం - ఆ ఆశ్రమం బ్రహ్మతేజస్సంపన్నుడు, సకలవిద్యావిశారదుడు, మహాతపస్వి, యమ-నియమాద్యష్టాంగ యోగ నిలయుడు, కపిల జటాధారియైన కణ్వ మహర్షి ఆశ్రమమది కేశిని - ఘోరులనే పుణ్యదంపతుల పుత్రరత్నం కణ్వుడు పతివ్రతా లక్షణాలన్నిటిని పుణికి పుచ్చుకొన్న సాధ్వీమణి కణ్వపత్ని

**అపురూప దాంపత్యం :**

ఒకనాడు ఆ మహర్షి తన దండ-కమండలాలను చేత పుచ్చుకొన్నాడు ఎక్కడికో ప్రయాణమయ్యాడు

''దేవీ!''

ప్రేమానురాగాలు నిండిన కళ్ళతో తన ఇల్లాలిని పిలిచాడు కణ్వుడు మనోహరంగా ఉందా పిలుపు. సిగ్గుతో బుగ్గలు సొట్టలు పడ్డాయామెకు.

''పిలిచారా స్వామీ!''

అంది ఆమె మాటలో ఆరాధన

''తమ్ముడు ప్రగాథుడేడీ?''

అడిగాడు కణ్వుడు తన ప్రియసోదరునికోసం ఆశ్రమం చుట్టు అన్వేషిస్తునాయి మహర్షి నయనారవిందాలు

'బహుశ ఇక్కడే ఎక్కడో ఉంటాడు' ఆమె సమాధానం

మితభాషిణి ఆ ఋషిపత్ని నిండు యౌవనంతో ఉన్న రూపసి. పున్నమి వెన్నెలను గుర్తుకు తెచ్చే ప్రశాంతవదనం చూపుల్లోచల్లదనం. పలుకుల్లోతేనెదనం సకలసుగుణరాశి ఆమెను భార్యగా పొందడం తన భాగ్యంగా భావించాడు మహర్షి తనకోసం దివినుండి భువికి దిగివచ్చిన రంభగా తలచాడు అవ్యాజమైన అనురాగమనే రాగాలాపనతో ఆమెను లాలించాడు. ఒకరికొకరు తోడు-నీడ ఎరుగరాని అనుబంధమది. ఎడబాటులేని ప్రేమ వారిది.

''దేవీ!''

పిలిచాడు మళ్ళీ దరి చేరింది

''నా వస్త్రాలిస్తావా?''

అడిగాడు కలువల చిరునవ్వుతో తెచ్చిపెట్టిందా స్మితవదన అందుకొన్నాడు. మరోసారి తనివితీరా తన అందాలరాణిని చూసుకొన్నాడు గాలిలో తేలుతున్న అనుభవం పాదుకలు ధరించాడు ప్రయాణ సూచకమది తడబడే అడుగులతో తారకలాగ తన నెలరాజుననుసరించింది ఆశ్రమం పొలిమేరదాకా నడచింది. సాదరంగా వీడ్కోలు పలికింది వెళ్ళిపోయాడు కణ్వుడు.

ఎంతటి సాహసం :

ఆ తరువాత కొంతసేపటికాశ్రమానికొచ్చాడు కణ్వసోదరుడు ప్రగాధుడు కణ్వకుటీరం చాల సాధారణంగా ఉంది ఆర్భాటాల్లేవు తప్పని సరిగ దర్శించవలసిన వస్తువంటూ ఏదీలేదక్కడ మట్టినేల గోమయంతో అలకబడింది అక్కడక్కడా కొన్ని దర్భాసనాలు ఒకచోట పూర్ణకలశవున్నది కొన్ని తాళపత్ర గ్రంధాలున్నాయక్కడ మహర్షియొక్క నిరంతరాధ్యయన శీలప్రతీకలవి చిన్న కొయ్యమీద ఒక దీపం చిన్నగా వెలుగుతోంది. పగటి పూట విశ్రాంతి, రాత్రిళ్ళు మేలుకోవడం దీపస్వభావం.

కణ్వపత్ని కూర్చొన్నది గాఢనిద్రలో ఉన్నాడు ప్రగాధుడు అతని తల ఆమె ఒళ్ళో ఉన్నది నిర్వికారంగా కొయ్యబొమ్మలా ఉన్నదా మహాసాధ్వి.

కుటీరం బయట పాదుకల చప్పుడు అటుకేసి వెళ్ళిందామె దృష్టి తాను కదల్లేదు కదిల్తే పసివాడైన ప్రగాధునికి నిద్రాభంగమవుతుందేమో! అదీ ఆమె ఆలోచన ఆమె కూర్చొనే ఉంది ప్రగాధుడు నిద్రపోతూనే ఉన్నాడు. మరింత దగ్గరైంది పాదుకల చప్పుడు కుటీరం గుమ్మంలో కొచ్చాడు కణ్వుడు. అక్కడి దృశ్యం చూశాడు. తన భార్య తొడమీద తమ్ముడి తల నిర్ఘాంతపోయాడు అంతే. తామస భావం శరీరంలోకి ప్రవేశించింది కళ్ళెరుపెక్కాయి. క్రోధాగ్ని అతన్ని దహిస్తోంది

**అతడు బూడిద కావాలి :**

భర్తను చూసిందామె ప్రాఘుణ్ణి నిద్రలేపే ప్రయత్నం చేసింది. లాభం లేదు కదల్లేదతడు లేపడం భావ్యం కాదేమో అనిపించి ఆ ప్రయత్నం మానుకొంది

తనను చూశాక కూడ ఆమెలో మార్పురాక పోవడాన్ని జీర్ణించుకోలేకపోయాడు కణ్వుడు సిగ్గుమాలిన ఆడది - అనే నిర్ణయానికొచ్చేశాడు నిబ్బరం కోల్పోయాడు. అమాంతంగా ఆమెను లాగెయ్యాలి - ఈ పాపకృత్యానికి తగిన శిక్ష వేయాలి - ప్రాఘుణ్ణి ముక్కలు ముక్కలుగ చేయాలి - ఇవీ అతని ఆలోచనలు

ఇంతింత్తై పెరుగుతోంది తమోగుణం. తన బట్టలు విసిరేశాడు. దండ - కమండలాలు దూరంగా పడేశాడు ఏదేమైనా సరే ఆ ఇద్దర్నీ శిక్షించాలి అంటే శపించాలి వడివడిగ అడుగులేశాడు. వివేకం వశం తప్పింది వివేకముండవలసినచోట క్రోధమావహించింది పిశాచంలా ఆదమఱచి నిద్రపోతున్న తమ్ముణ్ణి కాలితో తన్నాడు కోపంతో వణకి పోతున్నాడు. కళ్ళల్లో నిప్పులు తన కోపాగ్నికి తమ్ముడు బూడిదకావాలి. ఆ దృశ్యం ఆమె చూడాలి - ఇదీ అతని కోరిక

కాలి దెబ్బలు తిన్న ప్రాఘుడు నిద్రలేచాడు. జ్యేష్ఠభ్రాతనెదురుగా చూశాడు. వినయంతో ప్రణమిల్లాడు కోపంతో ఊగిపోతున్న అన్నయ్య భంగిమను చూశాక తనకు దెబ్బలు తగిలిన విషయం సైతం మరచాడు

ఆ అమాయకుడు.

కణ్వుని కోపం తగ్గలేదు కేకలు, అరుపులతో పెదవులు వణుకుతున్నాయి వేగం కారణంగా మాటల్లో అస్పష్టత వినయాభరణుడు ప్రగాఢుడు. అన్నయ్యముందు ప్రశాంతంగా నిలబడ్డాడు. అన్నకోపానికి కారణం తెలియలేదు

**ఈమె తల్లివంటిది :**

ఇప్పుడు కణ్వుని దృష్టి భార్యమీద పడింది. బుసలుకొడుతున్నాడు అతని కోపానికి కారణమేమిటో ఆమెకూ తెలియలేదు కోపావేశంలో అతని మాటతీరు మారింది

''ఛీ పాపాత్మురాలా !''

ఈ సంబోధనతో ఆమె అవాక్కయింది

తన అన్నయ్య కోపానికి కారణం అప్పుడు తెలిసింది నొచ్చుకొన్నాడు తమ్ముడు. అయినా నిబ్బరంగానే ఉన్నాడు. రజస్తమోగుణాలకవకాశం లేని పరమసాత్త్వికుడతడు అన్నయ్య పట్ల జాలి కలిగింది అంజలి ఘటించాడు

''అన్నయ్యా ! నీవు భ్రమ పడుతున్నావు'' అన్నాడు

తమ్ముడు ప్రశాంతంగా ఉండడం చూసి మరింత

రెచ్చిపోయాడన్నయ్య పళ్ళు బిగపట్టి -

''ఛీ పాపాత్ముడా !''

అంటూ కొట్టబోయాడు అతని దృష్టిలో ప్రగాధుడు నయవంచకుడు. తెలివైన వ్యభిచారి

ఏ మాత్రం వెరవలేదు ప్రగాధుడు తన వదినమ్మకేసి చూస్తూ

''ఈ మహాసాధ్వి నాకు తల్లివంటిది'' అన్నాడు శాంత స్వరంతో.

''మరి నేనో ?'' గద్దించాడన్నయ్య.

''నీవు నాకు పితృతుల్యుడవు'' ప్రగాధుని సమాధానం.

**నీకు శుభం కలగాలి :**

ఇంత చెప్పినా కోపం తగ్గలేదు. భార్యకేసి చూస్తూ

''ఛీ కళంకితా!'' అన్నాడు.

మౌనం దాల్చిందా ఉత్తమ ఇల్లాలు. జలజలా కన్నీళ్ళు రాలాయి మొహం ప్రక్కకు తిప్పుకొన్నాడు కణ్వుడు

''నీవు నాకన్నయ్యవు. కాని, ఇవ్వాళ్టినుంచి తండ్రివే ఈమె నాకు తల్లియే''

మళ్ళీ వినయంగా అన్నాడు ప్రగాథుడు

ఆ సమయంలో కణ్వుని చిత్తంలో ఏదో అలజడి మొదలైంది. రజస్తమో గుణాలు అతన్ని వీడాయి వివేకం పునఃప్రవేశించింది

''అన్నయ్యా ! నీవు మంత్ర ద్రష్టవు అంగిరస వంశోద్ధారకుడవు పరమ పవిత్రాత్మవు''

అన్నాడు ప్రగాథుడు

నఖ శిఖ పర్యంతము తమ్ముణ్ణి చూశాడు కణ్వుడు ప్రగాథుడు తప్పు చేయలేదు. అతని కళ్ళల్లో కామంలేదు హృదయంలో కళంకం లేదు. మాటల్లో మోసం లేదు అంటే మనోవాక్కాయ పరిశుద్ధుడనే స్థిరన్నిర్ణయానికొచ్చాడు.

ప్రగాథుడు వదిన పాదారవిందాలపై మోకరిల్లాడు

''అమ్మా ! నేను నీ పుత్రసమానుడను'' అన్నాడు

''పుత్రా ! ప్రగాథా !''

అని సంబోధించిందామె ఆ పిలుపుతో పులకరించిపోయాడు ప్రగాథుడు

''నీవు కూడ నీ అన్నయ్య వలె మంత్ర ద్రష్టవు అన్నయ్యకు తగ్గ తమ్ముడివి నీకు శుభం కలగాలని కోరుకొంటాను''

అన్నదామె వాత్సల్య పరిపూర్ణవచనాలవి నిండు మనసుతో చేసిన ఆశీర్వచనమది

**చూసిందంతా నిజంకాదు :**

ఈ తతంగ వంతా చూస్తున్నాడు కణ్వుడు కింకర్తవ్యతామూఢుడయ్యాడు వారిద్దఱితో ఆమె అన్నది -

''గురువుల ఆజ్ఞానుసారము మీ ఇద్దఱు ఈ ఆశ్రమంలో నివసిస్తున్నారు పరమ పవిత్రమీ ఆశ్రమం మీరు సదాచార సంపన్నులు. కళ్ళతో చూసిందల్లా వాస్తవం కాదు ఒకప్పుడది భ్రమ కావచ్చును మనసులో ఏదో కల్పనలొస్తుంటాయి అవన్నీ నిజం కావు''

తల్లి-దండ్రులుగ స్వీకరించిన ఆ పుణ్యదంపతులకు సాష్టాంగ ప్రణామం చేశాడు ప్రగాధుడు వారి చల్లని దీవెనలందుకొన్నాడు.

**కాణ్వ పరంపర :**

ఈ సోదరులుభయులు ఆయా వేదాల్లోని మంత్రాలను దర్శించారు. ఈ కణ్వగోత్రానికి సంబంధించిన ఋషులెందరో ఉన్నారు వీరిని కాణ్వులు లేదా కాణ్వాయనులంటారు ఋగ్వేదంలోని ఎనిమిదవ

మండలంలో ఈ అందటి పేర్లు మనకగుపిస్తాయి అవి -

| | | |
|---|---|---|
| 1. ప్రగాధుడు | 11 గోషూక్తుడు | 21 మేధ్యుడు |
| 2 మేధాతిధి (మేధ్యాతిధి) | 12 ఇరిమ్బిరుడు | 22 మాతరిశ్వుడు |
| 3. దేవాతిధి | 13 సోభరి | 23 కృశుడు |
| 4. బ్రహ్మాతిధి | 14 నీపాతిధి | 24 పృషధ్రుడు |
| 5. వత్సుడు | 15 నాభాకుడు | 25. సుపర్ణుడు |
| 6. పునర్వత్సుడు | 16 త్రిశోకుడు | 26 భర్గుడు |
| 7. సాధ్వంసుడు | 17 ప్రస్కణ్వుడు | 27 కలి |
| 8 శశకర్ణుడు | 18 పుష్టిగుడ | 28 హర్యతుడు |
| 9 పర్వతుడు | 19 శ్రుష్టిగుడు | 29 కురుసుతి |
| 10 నారదుడు | 20 ఆయువు | 30 కుసీది |

**కాణ్వ సంహిత :**

ఈ సందర్భంలో ''కాణ్వసంహిత'' విషయమై కొంత ప్రస్తావించవలసి యున్నది శుక్లయజుర్వేదం, కృష్ణయజుర్వేదమనే భేదంతో యజుర్వేదం రెండు రకాలుగున్నది శుక్లయజుర్వేదంలో 10 శాఖలు, కృష్ణయజుర్వేదంలో 14 శాఖలున్నాయి పది శాఖల్లో మొదటిది కాణ్వశాఖ ఈ శాఖ సంహిత, బ్రాహ్మణరూపాలతో

మనకందుబాటులో ఉంది కాణ్వ సంహితలో మొత్తం 40 అధ్యాయాలు 328 అనువాకాలు, 2086 మంత్రాలున్నాయి

**కణ్వుడంటే ఎవరు ?**

యాస్కముని ప్రణీతమైన 'నిఘంటువు' లో మేధావి పర్యాయాల్లో కణ్వశబ్దం పేర్కొనబడింది గనుక కణ్వుడు అంటే మేధావి అని అర్థం ఈ శబ్దానికి పురోహితుడనే అర్థం సాయణభాష్యం చెబుతోంది గానం చేయడం, స్తోత్రం చేయడం మరియు దేవతలను యాగక్రియలకాహ్వానించడం ఇతని విధులని కూడ వక్కాణిస్తోందా గ్రంథం. ఈ కోణంలో ఆలోచించినపుడు 'కణ్వ' శబ్దం ఒక వ్యక్తి పేరును గాక అతని విధిని సూచిస్తున్నది.

**కాణ్వశాఖలు :**

ఈ కాణ్వ పరివారానికి సంబంధించి ముఖ్యమైన శాఖలు నాలుగు ఋగ్వేదంలో అగుపిస్తాయి అవి - 1. వైయశ్వ శాఖ 2 ప్రియమేధ శాఖ 3 ఉపస్తుత శాఖ 4 సోబరి శాఖ

**నూతన శబ్ద ప్రయోగాలు :**

కాణ్వుల ప్రయోగాలలో 'బ్రహ్మణస్పతి' అనే శబ్దం వినిపిస్తున్నది అగ్ని, ఇంద్రుడు, బృహస్పతి అనే అర్థాలలో ఈ శబ్దం ప్రయుక్తమైంది. రుద్రుడనే అర్థంలో 'జలాషభేషజ' అనే శబ్దాన్ని కాణ్వులు

ప్రయోగించారు ఇలాగే అగ్నికి పర్యాయంగా ''అమీవచాతన'' అనే శబ్దాన్ని వారు వాడారు. రోగ నాశకుడని ఈ శబ్దానికర్థం

**కాణ్వస్తుతులు :**

ఋగ్వేదంలోను యజుర్వేదంలోను కణ్వమహర్షి, ఆయన వంశంవారు చేసిన అనేక దేవతాస్తుతులు మనకు సాక్షాత్కరిస్తాయి వాటిలో ముఖ్యమైన కొన్నింటిని ఇక్కడ పరిశీలిద్దాం -

**వాగ్దేవీస్తుతి :**

ఓ చదువులతల్లీ ! నీవు జ్ఞానప్రదాయినివి మననరూపిణివి బుద్ధి మరియు బలస్వరూపిణివి సకలవిధ రక్షకురాలవు ద్విశిరస్కవైన నీవు అంతర్ముఖ - బహిర్ముఖ రూపాలతో మమ్మల్ని అనుగ్రహించు బ్రహ్మ శక్తి నిన్ను ఛందోబద్ధం చేయగలదు నీవు సదా మాకు తోడుగ ఉండాలి మాకు ఐశ్వర్యాన్ని ప్రసాదించు మా ఆయువును పెంచు. నీ సంరక్షణలో ఉంటాం

**అగ్నిస్తుతి :**

సర్వేశ్వరా ! నేను దుష్కార్యాలు చేయరాదు మంచి పనులు మాత్రమే చేసేలాగ నన్ను అనుగ్రహించు ఇలా చేయడం ద్వారా నేను దీర్ఘాయువునై పవిత్రమైన జీవనం సాగిస్తాను తద్వారా ఉన్నతస్థితిని పొందుతాను సరళమార్గంలో నన్ను నడిపించి నాలో ద్వేష భావనలు

రాకుండునట్లు చేయాలి అలాగైతే నేను ఐహికాముష్మిక శాంతులను పొందగలను అగ్నిదేవా ! మేమాచరించే యాగాలు కోటిరెట్ల ఫలితాన్నివ్వాలి అన్ని వేళలా మాకు శుభప్రదాయకుడవు కావాలి

**సూర్యస్తుతి :**

లోకబాంధవా ! నీవు చీకట్లను పారద్రోలగలవు ఈ ప్రపంచానికి మార్గదర్శకుడివి ప్రకాశంతోపాటు జ్ఞానప్రకాశప్రదాతవు

**భూదేవీస్తుతి :**

భూమాతా ! నీవు సుఖప్రదాయినివి, కంటకరహితవు కావాలి. అలాగైనపుడే మేము నిన్ను చేరుకోగలం మా సుఖజీవనం కోసం అన్న - వస్త్రాదులనిచ్చి మా దారిద్ర్యాన్ని తొలగించు.

**మానవశరీరంలో సప్తర్షులు :**

కన్ను - ముక్కు - చెవి - నాలుక - చర్మమనబడే పంచ జ్ఞానేంద్రియాలు, మనస్సు మరియు బుద్ధి - ఈ ఏడు పదార్థాలు సప్తర్షుల్లాగ శరీరంలో ఉన్నాయి తమ తమ స్థానాల్లో ఇవి పదిలంగా ఉన్నాయి. జీవుడు నిద్రించే వేళల్లో ఇవి తమ స్థానాన్ని చేరతాయి అయితే ఆ సమయంలో జీవులను రక్షించడానికి ప్రాణము మరియు అపానము మేల్కొనే ఉంటాయి.

**రాజస్తుతి :**

రాజా ! ప్రజల పట్ల నీవాత్మీయతను చూపాలి ప్రజాక్షేమం కోసం యాగాలు చేయాలి శాంతిరక్షకుడవు కావాలి ప్రజలను హింసించరాదు పరిశుద్ధుడవై మసలుకోవాలి ప్రజాసౌకర్యాలు మెరుగు పరచాలి ప్రజలకు శత్రుభీతి లేకుండ చేయాల్సిన కర్తవ్యం నీదే నీవు సత్యవ్రతుడవు కావాలి నీ మాట, చూపు, వినికిడి పరిశుద్ధం కావాలి ఇంద్రియ నిగ్రహమలవఱచుకోవాలి నీ మనన శక్తి, ప్రాణ శక్తి పెంపొందాలి శక్తిమంతాలైన ఓషధులు నిన్ను కాపాడతాయి

**లక్ష్మి మహిమ :**

ఋగ్వేదం తొమ్మిదవ మండలంలో లక్ష్మిదేవి మహిమ ఇలా వర్ణితమైంది -

జీవుడు ధనసముపార్జనకోసం పుడతాడు అందుకోసమనే తన ఇంటి నుండి బయటపడతాడు తనను స్తోత్రం చేసిన వారికే జీవికనిస్తుందామె లక్ష్మిదేవి నాశ్రయించిన వారందఱు అమృత స్వరూపులయ్యారు ఈ అర్థాన్ని చెప్పే మంత్రమిలా ఉన్నది -

శ్రియే జాతః శ్రియ ఆ నిరియాయ శ్రియం వయో జరితృభ్యో దధాతి।
శ్రియం వసానా అమృతత్వమాయన్భవన్తి సత్యా సమిథా మితద్రౌ ॥

**వాయుసూక్తం :**

ఋగ్వేదం ప్రథమ మండలంలో వాయుసూక్తార్థమిలా ఉన్నది- వాయుదేవతలారా ! మీ గమనం వలన గృహాలు దెబ్బతినవచ్చుననే ఉద్దేశ్యంతో గృహదార్ఢ్యం కోసం గట్టి స్తంభాలను నిర్మిస్తున్నారు మానవులు మీ అమితవేగానికి భూమి కంపిస్తోంది చలనం లేని ఆకాశంనుండి పుట్టిన మీ గమనం అనుపమానం. శబ్దోత్పత్తి కారకులు మీరు. వాయుదేవతలారా ! మీరు బలవంతులు గనుక మానవులను తమ తమ విధులపట్ల ప్రేరేపించండి. మీ కారణంగానే మాకు వినికిడిశక్తి కలుగుతోంది అమితవేగం గల మీ వాహనాలతో కర్మభూమిని చేరండి. మీ సేవకులమైన మేము హవిస్సులతో మిమ్మల్ని తృప్తిపరుస్తాము. తండ్రివలె మీరు మమ్మల్ని మీ చేతుల్లోకి తీసికోండి ఏ మాత్రమూ ఆలస్యం చేయక భూలోకానికి తరలిరండి మణిరత్నాలు, గజాశ్వాలు మొదలైన లాంఛనాలతో ఇక్కడికి దయచేయండి. మిమ్మల్ని స్తోత్రం చేసేవారిని మృత్యువునుండి దూరం చేయండి వారు ఎట్టి పరిస్థితుల్లోనూ యమలోకం చేరరాదు వాయువు కారణంగా వచ్చే మేఘ గర్జనలు కుంభవృష్టిని కురిపిస్తాయి శత్రువుల బారినుండి మమ్మల్ని రక్షించండి మీ రథాశ్వాలకు శుభం చేకూరుగాక ! మాకు ఓజోగుణం ప్రసాదించండి ఋషులను ద్వేషించే వారిని శిక్షించండి

**కాణ్వుల నూతన దేవతా కల్పన :**

ఒకప్పుడు పురుష దేవతలకు మాత్రమే యజ్ఞాలలో

హవిస్సులందేవి  అయితే కణ్వవంశీయుడైన మేధాతిధి - ''అగ్నేపత్నీరిహావహ దేవానామ్'' అని అగ్నిదేవుణ్ణి ప్రార్ధించాడు ''ఓ అగ్నిదేవా ! దేవపత్నులను సైతం యాగశాలకు తీసికొనిరా'' అని మంత్రానికర్థం ఈ నూతన రీతిని పరిశీలించినపుడు స్త్రీలపట్ల కణ్వవంశీయులకు గల పూజ్యభావం స్పష్టమవుతోంది  ఇదేవిధంగా వాయువు, పృథివి, సదసస్పతి, విశ్వేదేవతలు మొదలైన నూతన దేవతలను కల్పన చేయడంలో కృతకృత్యుడయ్యాడు మేధాతిథి

ఈ విధంగా మంత్రద్రష్టలలో ఎంతో ప్రాముఖ్యం పొందిన ఘన కీర్తిమంతుడు కణ్వుడు  కాణ్వాయనులుగ ప్రసిద్ధులైన ప్రగాథుడు, మేధాతిథి, వత్సుడు మొదలైన ఋషులు కూడ మంత్రద్రష్టలై తమ వంశానికి వన్నె తెచ్చారు  ఈ ఋషులందరికీ మనమెంతో ఋణపడి ఉన్నాం  భక్తితో వీరిని స్మరించడం మన కనీసపు కర్తవ్యం

ఓం శాంతిః శాంతిః శాంతిః






5-7-1999 To 8-7-1999